# బంగారు లోయ

మూలం :

జాన్ రస్కిన్

అనుసరణ :

ఎస్. కె. వెంకటాచార్యులు, యం. ఏ.,

ప్రకాశకులు :

మారుతిరామా అండ్ కో., విజయవాడ.

విద్యావిషయక ప్రచారకులు

# బంగారు లోయ

## 1

ఒకానొక కాలమున స్టిరియా దేశమున నొక సారవంతమగు లోయ యుండెడిది. ఆ లోయచుట్టును మిగుల నెత్తైన పర్వతములు గలవు. ఆ పర్వతాగ్రము లెల్లప్పుడును మంచుచేఁ గప్పఁబడి యుండెడివి. అగ్రభాగములనుండి యనేక ప్రవాహములు, దిగువ భాగమునకుఁ బ్రవహించుచుండెడివి. అందొకటి పశ్చిమ దిశగాఁ బడుచుండెడిది. అస్తమించుచున్న సూర్యునికిరణము లాప్రవాహముపైఁ బడుచున్నపు డది సువర్ణచ్ఛాయతోఁ బ్రకాశించు చుండెడిది. అందువలన నది 'సువర్ణప్రవాహ'మని పిలువఁబడుచుండెడిది.

చుట్టుప్రక్కల వర్షము లేనప్పుడుకూడ లోయభాగమున వర్షము లుండెడివి. పంటలు బాగుగఁ బండుచుండెడివి. ఆపిలు పండ్లు, ద్రాక్షపండ్లు, రకరకముల తేనెలు సమృద్ధిగా దొరకుచుండెడివి. ఆ లోయ నప్పుడు చూచిన వారెల్ల రాశ్చర్యపడుచుండెడివారు. అందువలన నందరు లోయను బంగారులోయ యని పిలుచుచుండెడివారు.

ష్వార్జు, హాన్సు, గ్లిక్ అను మువ్వురు సోదరు లా లోయ కధికారులు. అందు మొదటి యిరువురును జూచుట కసహ్యముగా నుందురు. వారి కన్నులు, కనుబొమల తీరు చూపరులకు జుగుప్సను గలిగించును. వారా లోయలో సేద్యము

చేయుచు జీవించుచుండెడివారు. సేద్యమున వారు మిగుల
నేర్పరులని చెప్పక తప్పదు. వా రనతికాలముననే మిగుల ధన
వంతులైరి. కాని దయ యనునది వారియందు మచ్చునకైనఁ
గానరాదు. వారు నిర్దయతోఁ బక్షులను, రకరకముల కీటకము
లను జంపుచుండెడివారు. పనివాండ్రను మిగుల హింసించి,
వారి రక్తమాంసములను బీల్చి పనిచేయించుకొనుచుండెడి
వారు. పనియంతయుఁ జేయించుకొన్నతరువాత, వారికి డబ్బియ
వలసి వచ్చినపుడు, ఏదోయొక తగవు పెట్టుకొనెడివారు.
తత్ఫలితముగ డబ్బియకయే వారినిఁ బంపివేయుచుండెడివారు.
అందఱును ఆ సోదరు లిరువురను 'నల్లసోదరులు'అని పిలుచు
చుండెడివారు. నల్లసోదరులు, తమ పేరును సార్థకపఱచు
కొనుటకా యనునట్టుల నెల్లప్పుడును క్రూరముగనే ప్రవర్తించు
చుండెడివారు.

మూఁడవ సోదరుఁడగు గ్లక్ మొదటి యిరువురు సోదరు
లకుఁ బూర్తిగ ప్రతికూలము. ఈతఁడు దేవతాస్వరూపుఁడు.
వారు నక్కలు, ఈతఁడు గజము. వారు దోమలు. ఆకారమున
నేమి, స్వభావముననేమి, ప్రవర్తనముననేమి గ్లక్కును, మిగిలిన
యిరువురకును అణుమాత్రమైనఁ బోలిక లేదు. ఆతఁడు పండ్రెం
డేండ్లవాఁడు. రూపసి. దయామూర్తి. పరోపకార బుద్ధిగల
వాఁడు. ఆతఁడు తనసోదరులయొక్క యభిప్రాయములతో
నేమాత్ర మేకీభవించెడివాఁడు కాదు. అట్లనుటకన్న, సోద
రులే యాతని యభిప్రాయములతో నేకీభవించెడివారు కారని
చెప్పుట బాగుండును. నల్లసోదరు లాతనిని మిగుల నిర్దయతోఁ
జూచుచుండెడివారు. వారిదృష్టిలో నాతనికి, ఇతర పనివాం

ద్రకు ఎట్టి తేడాయును లేదు. వా రితరుల నట్లు హింసించు చుండెడివారో, గ్రికీనుగూడ నట్లు హింసించుచుండెడివారు. పనివాండ్రు చేయవలసిన పనులను గ్రికీ చేయుచుండెడివాడు. చెప్పులు శుభ్రపఱచుట, నేల శుభ్రపఱచుట, పళ్లెరములు కడుగుట మున్నగుపనుల నాతఁడే చేయుచుండెడివాఁడు. సోదరులు భుజంచిన పళ్లెరములలో మిగిలిన యన్నమును భుజించు చుండెడివాఁడు. ఆతఁడెంత కష్టపడుచున్నను సోదరుల చేతిలో దెబ్బలుమాత్రము తప్పెడివి కావు. అయినను అతఁడు సహనమునుమాత్రము కోల్పోయెడివాఁడు కాఁడు.

ఇటుల కొంతకాలము గడచెను. అంతలో వేసవికాలము వచ్చెను. కాని కాలవైపరీత్యమున చుట్టుప్రక్కల భూములలో వర్షము ధారాపాతముగఁ గురియఁజొచ్చెను. రైతులు తమ తమ వస్తువులను భద్రపఱచుకొనుటకు వీలులేకపోయెను. అచ్చటి పంట లన్నియుఁ బాడైపోయి సర్వనాశనమాయెను. కాని బంగారు లోయలో మాత్రము సూర్యుఁడు చక్కఁగఁ బ్రకాశించుచుండెను. చుట్టుపక్కల వర్షము లేనప్పు డిచట వర్షముండును. అచ్చట వర్షమున్నప్పు డిచ్చట వర్షముండదు. అది బంగారు లోయలోనివారి యదృష్టము! చుట్టుప్రక్కల నున్నజనులు నల్లసోదరులవద్దకు వచ్చి తిండిగింజలను గొను చుండిరి. ఇదే యదనని నల్లసోదరులు అమిత లాభమును గడింపసాగిరి. డబ్బున్నవారికే ధాన్యము లభించుచుండెను. మఱి బీదసాదలగతి యేమి? వారు నల్లసోదరుల నెంతో ప్రాధేయపడసాగిరి. వారి ప్రార్థనలకు శిలలైన ద్రవించునుగాని

ఆ సోదరుల హృదయములు ద్రవింపలేదు. పైపెచ్చు ఆ సోదరులు, వారిని నానావిధముల హింసలపాలొనర్చిరి.

శీతాకాలము సమీపించుచుండెను. ప్రచండ శీతల వాయువులచిహ్నములు బాగుగ కాన్పించుచుండెను. ఒకనాటి యుదయమున ఆ నల్లసోదరు లెప్పటివలె బయటకుఁ బోయిరి. పోవుటకు ముందు వారు గ్లక్‌తో నిటు లనిరి, "నీ వింట నుండి యెప్పటివలె రొట్టెలను గాల్చుము. మేము వచ్చునప్పటికవి సిద్ధముగా నుండవలెను. ఎవరిని లోనికి రానీయకుము. ఎవ్వరికి నేవస్తువు నీయకుము. మా యాజ్ఞల నేమాత్ర మతిక్రమించినను నీ ప్రాణములు నీవికావు. జాగ్రత్త." వర్షము ప్రారంభమై, ధారాపాతముగఁ గురియుచుండెను. గ్లక్ చలిబాధకుఁ దాళజాలక కుంపటివద్దఁ గూర్చుండి రొట్టెలు కాల్చుచుండెను.

అప్పుడు దయాస్వరూపుఁడగు, గ్లక్ మనమున ననేక భావములు పొడముచుండెను. రొట్టెలను చక్కఁగ గాల్చుచు నాతఁ డిటు లనుకొనుచుండెను, "అయ్యో, నా సోదరు లెంతటి కఠినాత్ములు! ఎప్పుడు నెవ్వరినిగాని భోజనమునకు రమ్మనరుగదా! మనయింట చక్కనిభోజన మున్నప్పుడు, ఇతరులకుఁగూడ నందులో కొంతభాగమిచ్చి వారితోఁబాటుగ భుజించుట, యెంత హృదయానందకరముగ నుండును! నా సోదరుల కట్టి భాగ్యము లేదు; నాకును లేదు!"

అతఁ డిటు లనుకొనుచుండఁగా నెవరో తలుపు తట్టిన శబ్దము వినఁబడెను. తటతటయను శబ్దమునువిన్న గ్లక్ తనలో

నిట్లనుకొనెను. "గాలికిఁ దలుపటుల చప్పుడగుచున్న దనుకొని దను. ఎవరును నిటుల తటతటమని మా యింటితలుపులను గొట్ట సాహసింపజాలరు. నా యన్నలసంగతి నందఱు బాగుగ నెఱుఁగుదురు."

తిరిగి తటతటమను శబ్దము విననాయెను. ధ్వని యంతకంతకు హెచ్చగుచుండెను. బయటనున్నవాఁడు లోనికిఁ బ్రవేశించుటకు మిగుల నాతురపడుచున్నట్లుండెను. అటుల గొప్ప ధ్వనితోఁ గొట్టుటవలనఁ గలుగు ఫలితముల నాతఁ డూహించినట్లు లేదు. గ్లక్ కిటికీవద్దకుఁ బోయి తలుపులు తెఱచెను. బయట నెవరున్నారో చూచుటకుఁ దలను గిటికీనుండి బయటకుఁ బెట్టెను. అచ్చటనున్న దెవరు? ఆతఁడొక యసాధారణమైన పొట్టిమనుజుఁడు. అట్టివానిని గ్లక్ యిదివఱకెన్నఁడును జూచి యుండలేదు. పెద్దముక్కు-, ఎఱ్ఱని, గుండ్రని బుగ్గలు- ఆతఁ డంతకుమున్ను చాలకాలమునుండి మండనిపొయ్యి నూదుటలో నిమగ్నుఁడై యున్నాఁడా యన్నట్లుండెను. కన్నులు మిలమిల మెఱయుచుండెను. మీసములు వంకరలు తిరిగియుండెను. తల మీఁదిజుట్టు వింతవింతరంగులు కలిగి భుజములు దాఁటియుండెను. ఆతఁడు నాలుగడుగుల ఆఱంగుళముల యెత్తుండును. ఆతఁడు శంఖాకారముగ నున్న యొక పొడుగాటిటోపీ ధరించి యుండెను. ఆ టోపీపై మూడడుగులు పొడవుగల యొకనల్లని యీఁక యలంకరింపఁబడియుండెను. ఆతఁడు తన శరీరమును బూర్తిగాఁ గప్పఁజాలిన యొక పొడుగాటి పైబట్ట ధరించెను. అది యాతని పొడవునకు నాలుగురెట్లుండును. ఆ బట్ట గాలి కెగురుచు చాలదూరమువఱకు వ్యాపించియుండెను.

ఆ నూతనుని యాకారమును జూచి గ్లక్ సంపూర్ణముగ నిశ్చేష్టుఁడాయెను. ఆతఁడు శిలాప్రతిమవలె నిలఁబడియుండెనేగాని, నోట యొక్కమాటయైనను వెలువడ లేదు. నూతనుఁడు మరలఁ గట్టిగాఁ దలుపుఁ దట్టెను. పిమ్మట వెనుకకుఁ దిరిగెను. అటులఁ దిరుగుటలో నాతఁడు గ్లక్‌ను జూడఁగలిగెను. అప్పుడాతఁడు గ్లక్‌తో నిట్లనెను. "నేనిక్కడ పడిగాపులు పడియుండఁగా నీవటులుండుట తగదు. ఒక గౌరవనీయు నిట్లనా యాహ్వానించుట! నేను దడిసి ముద్దయినాను. వెంటనే తలుపు తీయుము." నూతనుఁడు చెప్పిన విషయములో నతిశయోక్తి యొద్దియును లేదు. ఆతఁడు పూర్తిగఁ దడిసియుండెను. శరీరము పైనుండి క్రిందకు నీరు సంతతధారగాఁ గారుచునేయుండెను.

గ్లక్ నూతనున కిట్లు జవాబిచ్చెను, "నేను జాల విచారించుచున్నాను. నన్ను క్షమింపవలయును. నే నటుల చేయఁజాలను. నిజముగఁ జేయజాలను".

"ఏమి చేయజాలవు?" అని నూతనుఁడు ప్రశ్నించెను.

"నేను మిమ్ము లోనికిఁ బ్రవేశపెట్టఁజాలను. నిజము చెప్పుచున్నాను. నేను మిమ్ము లోనికిఁ బ్రవేశపెట్టినచో, నాకు నా సోదరులచేతులలో మరణము తప్పదు. మీకు నేనా సాహాయ్యమును జేయఁజాలను. మీ కేమి కావలయును?" అని గ్లక్ నూతనునితో ననెను.

అంత నూతనుఁ డిట్లనియెను, "ఏమి కావలయునా? నాకుఁ దలదాఁచుకొనుట కాశ్రయము కావలయును. చలికాచుకొను

టకు నిప్పుకావలయును. మీయింట నిప్పు ధగధగమండుచు, గోడలపై నాట్యమాడుచున్నది, ఉపయోగించుకొనువా రెవ్వరును లేకున్నారు. నన్ను లోనికి ప్రవేశపెట్టుము. కొంచెము చలి పోఁగొట్టుకొనవలెను.''

బయటకుఁ దలను బాగుగఁజాపియున్న గ్లక్ నూతనుని బాధను బూర్తిగఁ గ్రహించెను. ఆ బాధ నాతఁడుగూడఁ జవి చూచెను. ఆతఁ డొకపరి వెనుదిరిగి చూచెను. పొయ్యివద్ద మంటలు పై కెగయుచుండెను. అవి వృథాయగుచున్న విషయము నాతఁడు గ్రహించెను. దాని నాతఁడు సహింపలేక పోయెను. ఆతని హృదయము మెత్తఁబడఁజొచ్చెను. "పాప మాతఁడు బాగుగఁ దడిసియున్నాఁడు; లోనకుఁ బ్రవేశపెట్టి యొక పావుగంటకాలముమాత్ర ముండనిత్తును. ఈ లోపున మునిఁగిపోవునది యెద్దియును లేదు'' అని గ్లక్ అనుకొనెను. వెంటనే యాతఁడు కిటికీవద్దనుండి ద్వారమువద్దకుఁ బోయి తలుపులు తెఱచెను. నూతనుఁడు లోనికిఁ బ్రవేశించెను. ఆతనితోఁ బాటు పెద్దగాలిగూడ లోనికిఁ బ్రవేశించెను.

నూతనుఁడు గ్లక్తో నిట్లనియెను : "నీవు చాలమంచి పిల్లవాఁడవు. నీ సోదరులవలని భయమెద్దియు లేదు. వారేమో చేయుదురని విచారింపకుము. నేను వారితో మాటాడెదను.''

అంత గ్లక్ గద్గదస్వరముతో నిట్లనియెను, "మిమ్ములను నేను వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. మీ రట్టిపనిని మాత్రము చేయకుఁడు. మీ రిచ్చట నుండఁగా వారు వచ్చుట సంభవించినచో నాకు మరణముతప్ప వేఱు గత్యంతరము లేదు.''

"అయ్యయ్యో! అటులనా!! ఆ సంగతి వినుటకు నా కెంతయు విచారమగుచున్నది, నే నిచ్చట నెంతకాల ముండ వచ్చును?" అని నూతనుఁ డనెను.

"మాంసము తయారగునంతవఱకు" అని గ్లక్ జవా బిచ్చెను.

నూతనుఁడు వంటయింటిలోనికిఁ బోయి పొయ్యివద్దఁ గూర్చుండెను.

"త్వరలో మీ తడియంతయు నాఱిపోవును" అని గ్లక్ చెప్పి, మాంసము తయారుచేయుటకుఁ గూర్చుండెను. నూతనుఁడుమాత్రము చలికాచుకొను చున్నట్లులేదు. అతఁడు ధరించిన పొడుగాటి బట్టనుండి నీరు సంతత ధారగాఁ బ్రవహించుచు, నిప్పు నార్పివేయుచుండెను. ఇదియంతయు గ్లక్ చూచుచునే యుండెను. కొంతతడ వాతఁడేమియు ననక యూరకుండెను. కాని నీరంతకంతకు హెచ్చుచుండెను. ఎట్టకేలకు గ్లక్, నూతనునితో నిట్లనియెను, "అయ్యా, నే నిట్లనుచున్నందుకు క్షమింపుఁడు. మీపై బట్టనుదీసి యాఱవేయనా?"

"మంచిది నీ వటులఁ జేయ నవసరములేదు" అని నూతనుఁ డనెను.

"మీ టోపీ తీయుదునా?" అని యడిగెను గ్లక్.

"నన్నుగుఱించి నీవేమియు శ్రమపడవలసిన యవసరము లేదు. నాకంతయు బాగుగనే యున్నది" అని నూతనుఁ డనెను.

అంత గ్లక్ తటపటాయించుచు, తడఁబడుచు నిట్లనెను, "మీకొక విషయము చెప్పవలయును. మీరు నిప్పు నార్పివేయు చున్నారు".

నూతనుఁ డంత నిట్లనెను, "అది నాకు లాభకరముగదా! మాంసము తయారగునంతవఱకు నే నిచ్చట నుండవచ్చు నంటివి. అందువలన నిప్పు నార్పిన మాంసము త్వరగాఁ దయారుకాదు. కావున నేనిచ్చట చాలకాలము గడుపవచ్చును.

గ్లక్ కేమియు నర్థము కాలేదు. ఆతని మనస్సు పరిపరి విధముల పోయెను. అతిథియొక్క ప్రవర్తన యాతనికి బాధను గూడ గలిగించెను. అయిన నాతఁ డైదు నిమిషములవఱకుఁ దన పనిలో నిమగ్నుఁడై యుండెను..

అప్పుడు నూతనుఁడు గ్లక్‌తో నిట్లనెను, "మాంసము చాలబాగుగఁ దయారగుచున్నట్లున్నది. దానిలో నాకుఁ గొలఁదిగ నీయఁగలవా?"

"అది యసంభవము" అని గ్లక్ జవాబిచ్చెను.

"నేను జాల నాఁకలిగొనియున్నాను. నేను నిన్నకాని, నేఁటికాని యేమియు భుజింపలేదు. అట్టి సందర్భమున నీవు నా కోరికను నిరాకరించుట మిగుల విచారకరము. చూచుచు నే నెట్లూరకుండగలను?" అని నూతనుఁ డనెను.

నూతనునిగొంతు ఎట్టి కఠిన హృదయునైనను గరఁగించు నట్లుండెను. గ్లక్ హృదయము మెత్తఁబడిన దనుటలో

సందియు మొద్దయు లేదు. ఎట్టకేల కాతఁడు నూతనునితో నిట్ల నియెను, "నా సోదరు లీనాఁడు నాకుఁ గొలఁదిగ మాంసము నిచ్చుటకు వాగ్దానము చేసియున్నారు. నేను నా వాటా మాంస మును మాత్రమే మీ కీయఁగలను. అంతకుమించి మీకు నే నీయఁజాలను."

"నీవు చాల మంచి పిల్లవాడవు" అని నూతనుఁ డనెను.

"నే నొక యాఁకలిగొనియున్నవానికి సాహాయ్యము చేయుచున్నాను. అందువలన నా సోదరులు నన్ను హింసించి నను నష్టము లేదు" అని గ్లక్ తనలోఁ దా ననుకొనెను. అతఁ డొక పళ్ళెమును, చాకును సిద్ధపఱచెను. అతిథి కిచ్చుటకై యాతఁడొక మాంసపుముక్కనుగూడ సిద్ధపఱచెను. అంతలో వీధి తలుపులపై నెవరో గట్టిగాఁ దట్టిరి. నూతనుఁ డొక్కపరి యెగిరి గంతువైచెను. గ్లక్, కోసిన మాంసపుముక్కను, మిగిలిన మాంసమున కతికించి తలుపు తీయఁబోయెను.

* * *

# 2

గ్లక్ తలుపులు తెఱచెను. నల్లసోదరులు లోనికిఁ బ్రవే శించిరి. "మమ్ములను ద్వారమువద్ద నంతకాలము నిలఁబెట్టితి వేల?" అని ష్వార్జు ప్రశ్నించి, చేతిలోనిగొడుగును గ్లక్ ముఖము పైకి విసరివైచెను.

హోన్సు, గ్లిక్ చెవిని మెలిపెట్టుచు, "అవును, బుద్ధిహీనుఁడా ! నీవు తలుపులను దెఱచుటలో నంత ఆలస్యమేల చేసితివి ?" అని యనెను. తరువాత సోదరులు ముగ్గురును వంటయింటిలోనికిఁ బోయిరి.

నూతనునిఁ జూచి " ఎవఁడురా వీఁడు ?" అని ష్వార్జు ప్రశ్నించెను. ఆతని కోపమునకు మితి లేకుండెను. నూతనుఁడు నెత్తిపైనుండి టోపీ తీసివైచి శాంతముగ నిలఁబడియుండెను.

గ్లిక్ మిగుల భయముతో గడగడ వణఁకుచు నిట్లనియెను, "ఆతఁ డెవరో నిజముగా నాకుఁ దెలియదు. ముమ్మాటికిఁ దెలియదు. నా మాటను నమ్ముము".

"నీకుఁ దెలియనిచో నాతఁడు లోని కెట్లు ప్రవేశించినాఁడు ?" అని జ్యేష్ఠసోదరుఁడు గర్జించెను.

సోదరుని మనస్సును మెత్తఁబఱచు ధోరణిలో "ఆతఁడు బాగుగఁ దడిసినాఁడు ప్రియసోదరా !" అని గ్లిక్ అనెను.

ష్వార్జుకుఁ గోపము తగ్గలేదు. ఆతఁడు గ్లిక్‌ను శిక్షింపఁ బోయెను. కాని నూతనుఁ డడ్డుపడుటవలన గ్లిక్ కెట్టిహానియుఁ గలుగలేదు.

"నీ వెవరవు?" అని జ్యేష్ఠసోదరుఁడు నూతనునిఁ బ్రశ్నించెను.

"నీ పని యేమి ?" అని హోన్సు ప్రశ్నించెను.

"నే నొక ముసలివాఁడను. కడుబీదవాఁడను. మీయింట నిప్పున్న విషయమును కిటికీలోనుండి చూచి తెలిసికొంటిని. ఒక పావుగంటకాలము నన్ను లోపల నుండనీయవలసినదని మీ సోదరునిఁ బ్రార్థించితిని" అని నూతనుఁడు మిగుల సవినయముతోఁ దన విషయమును జెప్పెను.

అంత పెద్దసోదరుఁ డిట్లనెను, "నీ వెట్లు లోనికిఁ బ్రవేశించితివో, అట్లే బయటకుఁ బొమ్ము. నీవలన మా యిల్లంతయుఁ దడిసినది."

"నేను ముసలివాఁడను. బయట చలి విపరీతముగ నున్నది. అట్టి సందర్భమున నన్ను బయటకుఁ బొమ్మనుట న్యాయమా? నా నెరసిన వెంట్రుకలను జూడుఁడు. అప్పుడైనను మీకు దయ కలుగును" అని నూతనుఁ డనెను.

"నీ తలపైఁ జాల వెంట్రుక లున్నవి. అవి నిన్నుఁ జలి బాధనుండి రక్షింపఁగలవు. ముందు బయటకుఁ బొమ్ము" అని హాన్సు జవాబిచ్చెను.

"నేను పోవుటకు సిద్ధముగా నున్నాను. కాని నాకు మిగుల నాఁకలిగ నున్నది. కొలఁదిగ రొట్టె నీయుఁడు. భుజించి పోయెదను" అని నూతనుఁడు ప్రార్థించెను.

"రొట్టె కావలయునా? నీవంటి యనాకారులకు, మూటలను నిచ్చుటకేనా మేము రొట్టెను దయారు చేసికొన్నది?" అని పెద్దసోదరుఁ డనెను.

“నీ యింటికి నేల అమ్మివేయరాదు? పో, పో” అని హాన్సు అనెను.

“కొంచెదిగ నోట్లు చాలును” అని నూతనుఁడు తిరిగి ప్రార్థించెను.

“పో, పో” అని జ్యేష్ఠ సోదరుఁడు తీవ్రముగ ననెను. నూతనుఁడు మరలఁ బ్రార్థించెను.

హాన్సు మిగులఁ గోపించి, బయటికీడ్చుటకై నూతనునిఁ బట్టుకొనెను. కాని వెంటనే హాన్సు ఏడ్చుచు, పోయి పోయి యొక మూలను జేరుకొనెను. పెదసోదరుని కోపమునకు మితిలేకుండెను. అతఁడు నూతనుని గట్టిగాఁ బట్టుకొని బయటికీడ్వఁ దలఁచెను. కాని యాతఁడు నూతనుని ముట్టుకొనెనో లేదో, హాన్సువలెనే ఏడ్చుచుఁబోయి యదే మూలను జేరుకొనెను.

అప్పుడు నూతనుఁ డిట్లనెను, “సోదరులారా! నే నిప్పటికిఁ బోవుచున్నాను. మరల రాత్రి పండ్రెండుగంటలకు వత్తును. మీరు నా కాతిథ్యము నీయ నిరాకరించినారు. అట్టియెడ నేను మీ యింటికి వచ్చుటకు, రాత్రి వచ్చుటయే కడసారియైనచో మీ రాశ్చర్యము చెంద నవసరము లేదు.”

పెదసోదరుఁడు మూలనుండి లేచుచు “ఈసారి నిన్నుఁ బట్టుకొన్నచో ... ...” అని యేమో యనఁబోయెను. కాని యాతఁడు తన వాక్యమును ముగింపకమున్నె నూతనుఁడు బయటకుఁబోయి, గొప్పధ్వనితోఁ దలుపులు మూసివైచెను. అతని

శోకతో నా యింటినుండి యదృష్టలక్ష్మి బయటకుఁ బోయి నట్లుండెను.

పెద్దసోదరుడు గ్లక్‌తో నిట్లనియెను, "గ్లక్, ఇది యంతయుఁ గడుచోద్యముగ నున్నది. ఏదీ మాంసము? ఇదియేమి? ఇందొక ముక్క కోయఁబడియున్నది. ఎవరు కోసినారు? ఎందులకుఁ గోసినారు?"

"మీరు నాకొక ముక్క నిత్తునని వాగ్దానము చేసియున్నారు. జ్ఞప్తియందున్నదా?" అని గ్లక్ అనెను.

"అందువలన నీవు వేడిగా నున్నప్పుడే కోసి పాడు చేయఁదలఁచినావన్నమాట! ఇఁకముందు నీకట్టి వాగ్దానములు చేయను లెమ్ము. పో, బయటకుఁ బొమ్ము. బొగ్గులగదిలో నుండుము. నేను బిలుచువఱకు నీవు లోనికి రావలదు" అని పెద్దసోదరుడు కఠినముగఁ బలికెను.

గ్లక్ విచారహృదయముతో బయటకుఁ బోయెను. గదిలోనున్న యిరువురు సోదరులును దమ యిచ్చవచ్చినటుల భుజించి, మిగిలిన పదార్థములను దాఁచివైచిరి.

రాత్రి యంతయుఁ దీవ్రమైన గాలి వీవఁదొడఁగెను. వర్షము ధారాపాతముగఁ గురియఁజొచ్చెను. తలుపులు, కిటికీలు మున్నగున వన్నియుఁ గట్టుదిట్టముగ బిగించి, సోదరులిరువురును నిద్రించుటకై ఒకే గదిలోనికిఁ బోయిరి. రాత్రి పన్నెండు గంటలాయెను. అప్పుడొక గొప్పధ్వని వినఁబడెను.

సోదరు లిరువురును నిద్రనుండి మేల్కొనిరి. ఇంటి తలుపులు తమంతట తామే గొప్పధ్వని చేయుచుఁ దెఱచుకొనెను. ఒక భూకంపము వచ్చినట్లు, ఇల్లు సమూలముగఁ గదిలెను.

"ఈ వింతయేమి?" అని జ్యేష్ఠ సోదరుఁడు ఆశ్చర్యముతో లేచుచు నఱచెను.

ఎదుట నూతనుఁడు ప్రత్యక్షమై యుండెను. "నేనే వచ్చినాను. వత్తునని చెప్పియుంటినిగదా" అని యాతఁడనెను.

గది యంధకారమయమై యుండెను. ఇరువురు సోదరులును లేచి కూర్చుండి, యంధకారములోనికిఁ జూడసాగిరి. గదియంతయు జలమయమై యుండెను. కిటికీ సందునుండి యొక చంద్రకిరణము లోనికిఁ బ్రవేశించుచుండెను. ఆ వెలుతురులో సోదరు లిరువురును నూతనునిఁ జూచి, మిగుల నాశ్చర్యపడిరి.

అంత నూతనుఁ డిట్లనియెను, "మీకుఁ గష్టము కలుగఁ జేసినందుల కెంతయు విచారించుచున్నాను. పాపము! మీ గది యంతయు జలమయమైనది. మీ మంచములు తడిసిపోయినవి. మీ సోదరుఁ డున్నగది యెప్పటివలె బాగుగ నున్నది. మీ రచ్చటకుఁ బోయి మిమ్ము రక్షించుకొనవచ్చును."

సోదరు లిరువురును నూతనుని యపహాస్యపు పలుకులను గ్రహించి, మిగుల భయపడిరి. అయినను వా రప్పుడు చేయునదేమియు లేకుండెను. అందువలన, నిరువురును గ్లోక్ పరుండి యున్న గదివద్దకుఁ బరుగెత్తిరి.

నూతనుఁడు నల్ల సోదరులతో నిట్లనియెను, "నా పేరుగల కాగితము మీ వంటగదిలో టేబిలుపైఁ గనఁబడును. జ్ఞప్తియం దుంచుకొనుడు. ఇదిమీకు నా కడసారి దర్శనము."

"భగవానుని దయవలన నట్లేయగుఁగాక" యని హాన్సు పలికెను. అంతట నూతనుఁ డదృశ్యుఁడాయెను.

తెల్లవారెను. నల్లసోదరు లిరువురును గ్లక్ గదికిఁ గల చిన్న కిటికీలోనుండి బయటకుఁ దొంగిచూచిరి. వారియెదుట నేమున్నది? సర్వనాశనము వారికిఁ గన్పట్టినది. బంగారులోయ, మట్టిలోయ యైనది. వరదలవలన చెట్లు, పంటలు, పశువులు సర్వనాశనమైనవి. ఆ స్థానమున నెఱ్ఱనియిసుక, బూడిదరంగుగల బురద ప్రత్యక్షమైనవి. ఆ నల్లసోదరు లిరువురు గడగడ వణఁక సాగిరి. అట్లే వారు ప్రాఁకుచు భయముతో వంటగదిలోనికిఁ బోయిరి. ఇంటిలోని వస్తువు లన్నియు బయటకుఁ గొట్టుకొని పోయెను. లోన నొక్క ధాన్యపు గింజయైనను వారికిఁ గనఁబడ లేదు. వంటగదిలో నొక టేబిలుపై నొక కాగితము మాత్రము కనఁ బడెను. ఇరువురు సోదరులును దానిని దీసి చదువుకొనిరి. ఆ కాగితముపై ఇట్లుండెను.

## నైరృతిపవనము

* * *

# 3

నైర్‌ఋతి పవనము తనమాటను నిలుపుకొనె ననుటలో సందియ మెద్దియులేదు. అది మఱి బంగారు లోయలోఁ బ్రవేశింపలేదు. అంతియకాదు; తనసంబంధీకులగు పశ్చిమవాయువులను గూడఁ బ్రవేశింప నీయలేదు. అన్ని వర్ష వాయువులను నొకే త్రాటిపై నడువసాగెను.

అందువలన నొక సంవత్సరము దాటినను బంగారు లోయలో నొక చుక్క వర్షమైనను బడలేదు. మిగిలిన ప్రదేశములు పచ్చగాఁ బైరులతో నిండియున్నను, సోదరత్రయము నకుఁ జెందిన బంగారు లోయ మాత్రము ఎడారియై యుండెను. అటులఁ బరిస్థితులు తారుమారు రాయెను. ఒకానొక కాలమునఁ బంటలకు, సర్వ సంపదలకు నిలయమైన బంగారు లోయ నేఁడు ఎఱ్ఱని యిసుకకు మాత్రము స్థావరమై యుండెను. సోదరులు తమ దుస్థితి నేమాత్రమును సహింపఁ జాల కుండిరి. అందువలన వారు తమ లోయను వదలి, జీవనోపాధికై వేఱు పట్టణములకుఁ బల్లెలకుఁ బోఁదలఁచిరి. వారివద్దఁ గొన్ని బంగారు పళ్లెరములు, పాత్రలుమాత్ర ముండెను. వానితో వారు బంగారు లోయను వదలిపోయిరి.

సోదరు లొక పెద్ద పట్టణము చేరుకొనిరి. అపుడు జ్యేష్ఠ సోదరుఁడు హాన్సుతో నిట్లనియెను. "మనము బంగారు పని యందుఁ బ్రవేశింతము. ఇదిమనకుఁ జాల అనుకూలమైన వృత్తి. మనము, మన బంగారు వస్తువులను గరఁగించి, యందు రాగిని

గలుపుదము. దీని నెవ్వరును గనుఁగొనఁ జాలరు. మన మమిత లాభమును బొందవచ్చును."

జ్యేష్ఠుని యాలోచన బాగుగ నున్నదని హాన్సు అనెను. వారు బంగారు పనియందుఁ బ్రవేశించుటకు నిశ్చయించుకొని యందులకుఁ గావలసిన సాధన సామగ్రిని సమకూర్చుకొనిరి. బంగారుపని ప్రారంభించిరి. కాని యది వారికి లాభసాటి కాదాయెను. ప్రజల మన్ననలను వారేమాత్రమును బొందఁ జాలక పోయిరి. బంగారములో రాగిని గలుపుచున్న విషయ మును బ్రజలు గుర్తించి యసహ్యించుకొనసాగిరి. నల్లసోదరు లిరువురును వచ్చిన డబ్బంతయుఁ ద్రాగుడుకు వెచ్చింపసాగిరి. గ్లక్‌ను ఇంటవదలి ఇచ్చవచ్చినటులఁ దిరుగ సాగిరి. వారు దమవద్దనున్న బంగార మంతయుఁ గరఁగించిరి; గాని వారిచేత నొక కాసైనను మిగులలేదు. అంతయు దుర్వ్యసనములకే వెచ్చింపఁబడెను.

కడకు వారివద్ద నొక బంగారు పాత్ర మాత్రము మిగి లెను. అది గ్లక్‌కుఁ జెందిన పాత్ర. దాని నాతని కొక బంధు గిచ్చియుండెను. ఆ పాత్ర యనిన గ్లక్‌కు మిగుల మక్కువ. ప్రపంచ మంతయు ధారపోసి యిచ్చినను, గ్లక్ ఆ పాత్రను వదలుకొనఁడు. ఆపాత్రతో నాతఁడు మంచినీరు, పాలు త్రాగు చుండెడివాఁడు. ఆపాత్ర చూచుటకెంత యందమైనది గాదు. ఆ పాత్రకు ముందు భాగమునఁ జూపరులకు భయము కలి గించు నొక వికృతాకారపు బొమ్మ యుండెను. ఆ బొమ్మ

లోని రంపు కన్నులును సర్వ విషయములను జూడఁ గలిగి నట్లుండెను. ఆ బొమ్మ యనిన జ్యేష్ఠ సోదరునకు మిగుల నస హ్యము.

తన బంగారు పాత్రనుగూడ సోదరులు కరగింపఁ బోవు చున్న విషయము తెలిసినప్పుడు గ్లక్ కుఁ గలిగిన విచార మింతింత యని చెప్ప నలవిగాదు. ఆతఁడు తన యసమ్మతిని సోదరులకుఁ దెలిపెను. కాని వారాతని నపహాస్యముపాలు చేసిరి. బంగారు పాత్రను గరఁగఁబెట్టిరి. త్రాగుటకై పానశాలకుఁ బోయిరి. బంగారుపాత్ర కరఁగుచున్నంతకాలము గ్లక్ మనసు మనసులో లేదు.

విచార హృదయముతో గ్లక్ కిటికీ వద్దకుఁ బోయి కూర్చుండెను. అక్కడ చక్కని చల్లనిగాలి వీచుచుండెను. అది గ్లక్కు హృదయానందమును గలిగించెను. ఆతఁడు బయటకుఁ దొంగి చూచుచుండెను. ఆతనికి దూరమున నున్న కొండలు కనఁబడెను. సువర్ణ ప్రవాహము బయలుదేఱిన కొండనుగూడ నాతఁడు చూడఁ గలిగెను.

సాయంకాల మాయెను. సూర్యుఁ డస్తమించుచుండెను. సూర్యుని యరుణ కాంతులతోఁ గొండ శిఖరములు వినూత్నముగఁ గన్పట్టుచుండెను. మేఘములు చక్కఁగ నడయాడు చుండెను. సువర్ణ ప్రవాహము మిగుల శోభాయమానమై యుండెను. గ్లక్ సువర్ణప్రవాహమును గొంతసేపు తిలకించెను. హఠాత్తుగ నాతఁ డిట్లనెను, "ఆ ప్రవాహ మంతయు నిజముగ బంగారు మయమైన నెంత బాగుండును! ఏమి యానందముగ నుండును!!"

"ఏమాత్రె ముండను!" అను మాట లాతనిక దగ్గఱగా వినఁబడెను.

గ్లిక్ ఉలిక్కి-పడి లేచి "ఎవరిదీ గొంతు?" అని యఱచెను. కాని యక్కడ నెవరును లేరు. అతఁడు గదియంతయు ననేక పర్యాయములు కలయఁ జూచెను. తన వెనుక భాగము ననేకసార్లు చూచుకొనెను. టేబిలు క్రిందఁ జూచెను. కాని యాతని కెవ్వరును గనఁబడలేదు. ఆతని కంతయు నాశ్చర్యముగ నుండెను. అతఁడు మరలఁ గిటికీవద్దఁ గూర్చుండెను. ఈసారి యాతఁడు పైకేమియు మాటాడలేదు. కాని యాతఁడు, సువర్ణప్రవాహ మంతయు సువర్ణమయమైన నెంతో బాగుండు నని మనస్సులో ననుకొనెను. ఆ యాలోచన యాతని మనస్సులో గాఢముగ నాటుకొనెను.

"ఏమాత్రమును గాదు, కుఱ్ఱవాఁడా!" యను మాటలు గ్లిక్కు వినఁబడెను. ధ్వని మునుపటికంటె మిన్నగ నుండెను.

"ఎవరా మాట్లాడుచున్నది! అంతయు వింతగనున్నదే" యని గ్లిక్ అరచెను. అన్నిమూలల వెదకెను. బీరువాలు, అలమారలు వెదకెను. ఎవరును గనఁబడలేదు. అతివేగముగ గిరగిర తిరుగఁజొచ్చెను. తన వెనుక నెవరో యున్నారని యాతఁడు గాఢముగ నమ్ముచుండెను. మరల నాతనికి మునుపటి ధ్వని వినఁబడఁజొచ్చెను. ఎవరో పాడుచున్నట్లుండెను. నీరు మఱుఁగుచున్న పాత్రనుండి యాధ్వని వచ్చినట్లుండెను. గ్లిక్ కిటికీనుండి బయటకుఁ జూచెను. క్రిందఁ జూచెను. పైనఁ జూచెను. ఎవరును

గనఁబడ లేదు. ఆ గదిలోనే ఎవరో యున్నారనియు, చక్కని స్వరముతోఁ బాడుచున్నారనియు నాతఁడు తలఁచెను. ఆధ్వని పొయ్యివద్దనుండి వచ్చుచున్నదని గ్లక్కు హఠాత్తుగఁ దట్టెను. వెంటనే యాతఁడు పొయ్యివద్దకుఁ బరుగెత్తెను. ధ్వని పొయ్యి వద్దనుండియే కాక పొయ్యి పైనున్న మూసలోనుండి వచ్చుచున్నట్లుండెను, మూసపై మూత నాతఁడు తీసివైచెను. మూసయే పాడుచుండెను! గ్లక్ భయముతో వెనుకకుఁ బరుగెత్తెను. ఆతఁడు పొయ్యికి దూరముగానున్న యొక మూలకుఁ బోయి, చేతులు పైకెత్తి, నోరు తెఱచుకొని యొకటి రెండు నిమిషములు నిలఁబడి యుండెను.

హఠాత్తుగ పాట యాఁగి పోయెను. మునుపటికన్న స్పష్టమగు ధ్వనితో "ఓయీ!" అను మాట వినఁబడెను. గ్లక్ జవాబీయలేదు. "ఓయీ, గ్లక్, ప్రియమైన కుఱ్ఱవాఁడా!" యని మరల మూస యనెను. గ్లక్ ఎక్కడలేని ధైర్యమును దెచ్చుకొనెను. తిన్నఁగాఁ బొయ్యివద్దకుఁ బోయెను. మూసను బొయ్యిపైనుండి క్రిందకుదింపి లోనికిఁ జూచెను. బంగారమంతయుఁ గరఁగియుండెను. పైభాగము స్వచ్ఛముగ నుండెను. కాని యందులో గ్లక్కుఁ దననీడ కనఁబడుటకు బదులు బంగారు పాత్రపైఁగల బొమ్మ కనఁబడ సాగెను. బొమ్మకన్నులు చాల వాడిగ, నిశితముగ నుండెను.

"రా, రా, గ్లక్, నే నెప్పటివలెనే యున్నాను. నన్ను బయటకుఁ బోయుము" అని మూసలోనుండి ధ్వని యాతనికి వినఁబడెను. గ్లక్ ఆశ్చర్య సాగరమున మునిఁగి యుండెను.

ఆతని కేమి చేయుటకును దోఁచకుండెను. అందువలన నాతఁడటుల చేయలేదు.

“నన్ను బయటకుఁ బోయుము” అని మరల ధ్వని వినఁబడెను. అప్పటికిని గ్లిక్ ఏమియుఁ జేయలేదు. “నేనుచాల వేఁడిగా నున్నాను. నన్ను బయటకుఁ బోయవా?” యని మరల ధ్వని విననాయెను. గ్లిక్ లోఁ గదలిక కలిగెను. ఆతఁ డతి ప్రయత్నమున మూసను బట్టుకొని క్రిందకు వంచెను. కాని యందుండి బంగారపు నీరు క్రిందఁబడలేదు. మొదట కాళ్ళు, తరువాత నడుము, చేతులు, కడకుఁ బంగారు పాత్రపైఁగల యాకారమువంటి తల క్రిందకు రాసాగెను. చివరకు గ్లిక్ ఎదుట ఒకటిన్నర యడుగుల యెత్తుగల మఱుగుజ్జు నిలఁబడి యుండెను. “అంతయు బాగుగ నున్నది!” యని మఱుగుజ్జు చేతులు, కాళ్ళు బాగుగఁ జూచుకొనఁజొచ్చెను. గ్లిక్ నిర్ఘాంతపడి నిలఁబడియుండెను. ఆతని నోటివెంబడి మాటవచ్చుట లేదు.

మఱుగుజ్జు తన్ను తానొకసారి వివరముగఁ బరీక్షించుకొనెను. అటుపిమ్మట నాతఁడు తన నిశితమైన రెండు కన్నులను గ్లిక్ పైకిఁ బఱపి యిట్లనెను, “ఏమాత్రము బాగుండదు, గ్లిక్!”

హఠాత్తుగా వచ్చిన మఱుగుజ్జు మాటలు గ్లిక్‌కు అర్థముకాలేదు. అవి యాతనికి సందర్భరహితముగఁ దోఁచెను. అవి గ్లిక్ మనస్సులోని యాలోచనలకు సంబంధించినవై యుండెను. ఆ యాలోచనలేగదా మొదట మూసను మాటాడించెను. ఏమైననేమి గ్లిక్ ఆమాటలను ప్రతిఘటింపఁ దలఁపలేదు.

గ్లక్ అతి వినయముతో మెల్లన నిట్లనియెను, "అయ్యా బాగుండదా?"

"ఏమాత్రము బాగుండదు" అని మఱుగుజ్జు పునరుద్ఘాటించెను. తరువాత నాతఁడు తన తలపై టోపీని ముందుకు లాగి గదిలో నిటునటు తిరిగెను. ఈ యాలస్యము గ్లక్‌నకు లాభకారియాయెను. ఆతఁ డాలోచించుకొనుటకు సమయము దొరికెను. ఒక మఱుగుజ్జును జూచి భయపడవలసిన యవసర మెద్దియు లేదని యాతఁడు భావించెను. ఆతని కాశ్చర్యము సన్నగిలెను. మఱుగుజ్జును గూర్చిన వివరములు తెలిసికొన వలెనను కుతూహలము హెచ్చెను. అందువలన నాతఁడు మఱుగుజ్జుతో నిట్లనియెను, "అయ్యా, దయయుంచి నాసందేహమును దీర్చుఁడు. మీరు నా బంగారు పాత్రయా?"

ఆ మాటలను వినఁగానే మఱుగుజ్జు ఒక్కపరి గిరుక్కునఁ దిరిగి, తిన్నఁగా గ్లక్ వద్దకుఁ బోయెను. తన యెత్తంతయుఁ దెలియునటుల సాగి నిలఁబడి యిట్లనెను, "నేను సువర్ణ ప్రవాహ ప్రభువును." అటుపిమ్మట నాతఁడు పెద్దపెద్ద యంగలను వైచుచు నటునిటు తిరుగాడసాగెను. తన మాటలవలనఁ గలిగిన యాశ్చర్యమునుగూర్చి యాలోచించుకొనుటకు, గ్లక్‌నకాతఁడు వ్యవధి నిచ్చెను. తరువాత నాతఁడు మరలఁ దిన్నఁగా గ్లక్ వద్దకుఁ బోయి నిటారుగ నిలఁబడెను. ఆతఁడు గ్లక్ వద్దనుండి యేదో సమాధానము నాశించుచున్నట్లుండెను. గ్లక్ ఏదోయొకటి చెప్పుటకు నిశ్చయించి, "ఘనులైన తాము క్షేమముగ నున్నారని తలఁచెదను" అని యనెను.

గ్లక్ మాటలను స్పృశింపకయే మఱుగుజ్జు ఇట్లనియెను, "మీ మానవులందఱు సువర్ణ ప్రవాహమని పిలుచుచున్న నదికి నేను ప్రభువును. నాకంటె బలవంతుఁడైన యొక రాజుమూల మున నీవు మున్ను నాలోఁజూచిన వికృతరూప మేర్పడినది. ఆ రాజు మంత్రశక్తినుండి నీవు నన్నిప్పుడు రక్షించినావు. స్వేచ్ఛ నొసఁగినావు. నీ వెట్టివాఁడవైనది, నీవు నీ సోదరుల కెట్టిసేవ చేసినది, నాకుఁ దెలియును. అందువలన నేను నీకు సేవచేయుటకు నిశ్చయించుకొన్నాను. నేను జెప్పునది సావధానముగ నాల కింపుము. సువర్ణప్రవాహము పుట్టుచున్న పర్వతాగ్రమున కెక్కి, యచ్చటనుండి, మూఁడు చుక్కల పవిత్రజలము నెవరు ప్రవా హములోఁ బోయుదురో వారి కాసువర్ణప్రవాహము, సువర్ణ మయమగును. కాని ఒక్క విషయమును జ్ఞప్తియందుంచుకొనుము. ఎవరైనను మొదటి ప్రయత్నమున మాత్రమే విజయము సాధింపఁగలరు. మొదటిసారి విజయమును సాధింపలేనివాఁడు, రెండవసారిగూడ విజయమును సాధింపలేఁడు. అపవిత్ర జల మును బోయువాఁడు నల్లశిలయగుననికూడ జ్ఞప్తియందుంచు కొనుము.

సువర్ణప్రవాహప్రభు వటుల మాటలాడి తిన్నఁగా నడచి భగభగ మండుచున్న పొయ్యిమధ్యకుఁ బోయెను. ఆతని రంగు క్రమక్రమముగా మారిపోసాగెను. కడకాత డావిరియైపోయెను. అటుల సువర్ణప్రవాహప్రభు వదృశ్యుఁడై పోయెను,

అంత గ్లక్ అచ్చట కలుచుచుఁ బోయి "అయ్యో, అయ్యో, నా పాత్ర! నా పాత్ర!! నా పాత్ర!!! అని యనెను.

* * *

## 4

సువర్ణప్రవాహప్రభు వదృశ్యుడైన మఱుక్షణముననే నల్లసోదరు లిరువురును గర్జించుచు లోనికిఁ బ్రవేశించిరి. బంగారుపాత్ర మాయమైనదను విషయమును వారు తెలిసికొనిరి. తమ కడపటి సొత్తు మాయమాయె ననువిషయమును దెలిసికొన్నపుడు వారికిఁ గలిగిన కోప మింతింత యని చెప్పనలవిగాదు. దానికి బాధ్యుఁడు గ్లక్ అని వారు తలంచిరి. అందువలన నల్లసోదరు లిరువురును గ్లక్‌ను ఒక బావుగంట వఱకుఁ జితుకఁ గొట్టిరి. తరువాత వా రిరువురును రెండు కుర్చీలపైఁ గూర్చుండి "బంగారు పాత్ర యెట్లు మాయమైనది?" అని ప్రశ్నించిరి.

గ్లక్, జరిగిన విషయ మంతయు వారికిఁ బూసగ్రుచ్చినటుల చెప్పెను. కాని నల్లసోదరు లందొక యక్షరమైనను నమ్మలేదు. అంతటితో నూరకుండక మరల గ్లక్‌ను జావగొట్టిరి. వారిచేతులు నొప్పిపుట్టు నంతవఱకుఁ గొట్టిరి. పిమ్మట పరుండిరి.

తెల్లవాఱిన తరువాత సోదరు లిరువురును లేచిరి. గ్లక్ చెప్పిన విషయమును గూర్చి వారు తీవ్రముగ నాలోచించిరి.

అతఁడు చెప్పిన ధోరణిని జూడఁగా సందు నిజముండ వచ్చునని వారు భావించిరి. వారివద్ద ధనము లేకపోవుటచే, సువర్ణప్రవాహమును సువర్ణమయము చేసి లాభము పొందఁ దలఁచిరి. కాని యిరువురిలో నెవరు మొదట ప్రయత్నింప వలెనను విషయమున వారికి భేదాభిప్రాయము జనించెను. మాటల యుద్ధము కత్తుల యుద్ధములోనికి దిగెను. ఆ సవ్వడికిఁ జుట్టు ప్రక్కలవారు లేచిరి. వారు సోదరులను శాంతింపఁ జేయఁ జూచిరి గాని లాభము లేక పోయెను. అందువలన వారు రక్షకభటుని కొఱకుఁ గబురంపిరి.

ఆ విషయమును దెలిసికొన్న హాన్సు ఎచ్చటికో పోయి దాఁగుకొనెను. జ్యేష్ఠసోదరుని రక్షకభటులు విచారణాధికారి వద్దకుఁ దీసికొని పోయిరి. శాంతికి భంగకరముగాఁ బ్రవర్తించినాఁడని, విచారణాధికారి యాతనికిఁ గొంతడబ్బు జరిమానా విధించెను. కాని యాతనివద్ద డబ్బు లేదు. అందువలన నాతఁడు కారాగారమునఁ ద్రోయఁబడెను.

హాన్సున కా విషయము తెలిసెను. ఆతఁడు మిగుల సంతసించెను. వెంటనే సువర్ణప్రవాహము వద్దకుఁ బోవుట కాతఁడు నిశ్చయించుకొనెను. కాని పవిత్రజలము నెట్లు సంపాదింప వలెనో యాతనికి బోధపడలేదు. మతాధికారి వద్దకుఁ బోయి పవిత్ర జలము నిమ్మని యడిగెను. అట్టి దుష్టున కిచ్చుట కాతఁడు నిరాకరించెను. అందువలన నాతఁడు చీకటిపడువరకు నుండి చర్చినుండి యొక పాత్రతోఁ బవిత్ర జలమును దొంగిలించెను. విజయము పొందిన సంతోషముతో నింటికిఁ బోయెను.

మఱునాఁటి యుదయమున హాన్సు పెందలకడ లేచెను. పవిత్ర జలమును దీసికొనెను. కొన్ని యాహార పదార్థములను, ద్రాక్ష సారాయమును సిద్ధపఱచుకొనెను. ఒక గట్టి కఱ్ఱ నూతగాఁ దీసికొని సువర్ణ ప్రవాహము వద్దకుఁ బయనమై పోయెను. అతఁడు పోవుత్రోవలో జ్యేష్ఠ సోదరుఁ డుంచఁబడిన కారాగార ముండెను. జ్యేష్ఠుఁడు ఒక కిటికీవద్ద విచార మనస్కుఁడై కూర్చుండియుండెను. హాన్సాతనిని సమీపించి, "సోదరా, నే నచ్చటకుఁ బోవుచున్నాను. సువర్ణ ప్రవాహ ప్రభువున కేదేని సందేశము నిచ్చెదవా?" పెద్దసోదరుఁడు పండ్లు పటపట కొఱుకసాగెను. కిటికీ యూచలను బట్టుకొని యూపెను. హాన్సాతనిని జూచి నవ్వెను. "నేను దిరిగి వచ్చువరకు సుఖముగ నుండుము." అని హాస్యముగఁ బలికి తన దారినిఁ బోసాగెను.

ప్రభాతము చాల మనోహరముగ నుండెను. పర్వతముల దృశ్యము హృదయానందకరముగ నుండెను. కాని హాన్సున కవి యేవియుఁ బట్టలేదు. అతని యాలోచన లన్నియు సువర్ణ ప్రవాహముపైఁ గేంద్రీకృతమై యుండెను. దూరమును లెక్కింపక యాతఁడు కడువేగముగ నడువసాగెను. కొంత సేపగు సరి కాతఁ డలసి పోయెను. ఆతనికి, సువర్ణ ప్రవాహము జనించిన చోటికి మధ్య నొక మంచు ప్రవాహ ముండెను. దానిని దాటుట కత్తితో సాము చేయుట వంటిది. హాన్సు, కష్టముల లెక్కింపక ముందుకు సాగిపోవుచునే యుండెను. కాని శరీర పాటవము తప్పిపోవుచుండెను. చెవులు గింగురులెత్తుచుండెను. తల భారముగు చుండెను. ముందునకుఁ బోవుచున్న

కొలఁది యాతనికి బాధ లెక్కువగు చుండెను. ఎట్టకేల కాతఁడు మంచు ప్రవాహమును దాఁటగలిగెను.

మంచు ప్రవాహమును దాఁటుచున్నప్పు డాహారముల బుట్ట యాతనికి భారమనిపించెను. అందువలన నాతఁడు దానిని బాఱవైచెను. మంచు ప్రవాహమును దాఁటిన తరువాత నాతని కాఁకలి యెక్కువాయెను. కాని తినుట కాహార పదార్థము లెవ్వియు లేకుండెను. అందువలన నాతఁడు కొన్ని మంచు ముక్కలను దినెను. దానివలన నాతనికి దాహము తీఱెను. పిమ్మట నాతఁడొక గంటసేపు విశ్రమించెను. ఆ విశ్రాంతితో నాతఁడెప్పటి మానిసి యాయెను. అతఁడు మరలఁ బ్రయాణము సాగించెను.

అంతయుఁ గఠిన శిలామయ ప్రదేశము. క్రింద నొక గడ్డి పోచయైనను లేదు. ములుకులవంటి ఱాళ్ళపై నడచుచున్నప్పుడు, ఆతని పాదములు కొట్టుకొని పోవుచుండెను. మధ్యందిన మార్తాండుఁడు తీవ్రముగఁ బ్రకాశించు చుండెను. హాన్సు తల మాడుచుండెను. విశ్రాంతి తీసికొనుట కొక చెట్టయినను లేకుండెను. హాన్సు పూర్తిగ నలసిపోయెను. దానికిఁదోడు దాహ బాధ మిక్కుటమాయెను. తనవద్దఁగల పవిత్ర జలము నాతఁడు త్రాగఁ దలఁచెను, "నా యుద్యమమునకు మూఁడు చుక్కలు చాలును. కొలఁదిగ పెదవులను దడపి కొందును". అని హాన్సు అనుకొనెను.

హాన్సు పవిత్ర జలపాత్రను బైకెత్తెను. అంతలో నాతని దృష్టి ప్రక్కగానున్న యొక వస్తువుపైఁ బడెను. అది కదలు

చున్నట్లుండెను. అది యొక చిన్న కుక్క. దాహ బాధవలన మరణించుటకు సిద్ధముగా నుండెను. దాని నాలుక బైటకు వచ్చెను. దౌడ లెండిపోయెను. మిగిలిన యవయవములు జీవము లేని హానివలెనుండెను. నల్ల చీమలా కుక్కపై బారులుగ ప్రాకఁజొచ్చెను. కుక్క కన్నులు పవిత్ర జలపాత్రను జూచుచున్నట్లుండెను. హాన్సు కుక్కను లెక్కచేయక పవిత్ర జలమును ద్రాగెను. కుక్కను గట్టిగాఁ దన్ని ద్వేష భావమున నుమిసెను. ముందుకుఁ బోసాగెను. హఠాత్తుగా నాకసము నొక వింత మబ్బావరించినట్లుండెను.

పోయినకొలఁది ప్రయాణము కష్ట కష్టమాయెను. హాన్సుకు దాహబాధ తీఱలేదు. అంతకంత కెక్కువ కాఁజొచ్చెను. ఒక గంట కాలము గడిచెను. పవిత్ర జలపాత్ర నాతఁ డొక్కపరి చూచెను. అందు సగము ఖాళీగానుండెను. కాని యందు నీరు కావలసిన మూఁడు చుక్కలకంటె నెక్కువగా నుండెను. ఆతఁడు పవిత్ర జలమును ద్రాగనెంచి పాత్రను బైకెత్తెను. అంతలో నాతనికిఁ గెదుట నెవరో కదలు చున్నట్లు కనఁబడెను. అదియొక అందమైన పిల్లవాఁడు. ఆతఁడు కొనయూపిరితో నున్నట్లుండెను. మిక్కుటమగు దాహ బాధతో నాతని ఱొమ్ము తీవ్రముగఁ గొట్టుకొను చుండెను. కన్నులు మూతబడి యుండెను. పెదవులు పూర్తిగ నెండిపోయి యుండెను. హాన్సు పిల్లవానిని జూచెను. కాని యాతనికి సాహాయ్యము చేయఁ దలచలేదు. పవిత్ర జలమును ద్రాగి ముందుకు సాగిపోయెను.

ఆకసమున నల్లని మేఘము క్రమ్ముకొనెను. భయంక
రాకారముతోఁ గూడిన నీడలు పడఁ జొచ్చెను. హాన్సు కష్ట
పడుచు ముందుకు సాగిపోఁ జొచ్చెను. సూర్యుఁ డస్తమింప
మొదలిడెను. కాని వేఁడిమి మాత్రము తగ్గలేదు. హాన్సంత
కంత కలసిపోవుచుండెను. గమ్యస్థానము సమీప మగుచుండెను.
అయిదు వందల అడుగుల యెత్తున సువర్ణ ప్రవాహము బయలు
దేఱిన ప్రదేశము హాన్సు కంటబడెను. అతఁడు త్వరితముగఁ
దన గమ్యస్థానమును జేరఁదలఁచెను.

అంతలో నాతని కొక సన్నని కేక వినఁబడెను. హాన్సు
వెనుదిరిగి చూచెను. కొండపైఁ బరుండియున్న యొక ముసలి
వాఁడు, ఆతనికిఁ గనఁబడెను. ఆ ముసలివానికిఁ గన్నులు
బాగుగ లోతుకుఁ బోయి యుండెను. ఆతఁడు చాల నీరసించి,
మరణ శయ్యపై నుండెను. ఆతఁడు మెల్లన హాన్సు వైపుకుఁ
దన చేతులు చాపి, "నీరు! నీరు!! నేను మరణించు చున్నాను"
అని యనెను.

అంత హాన్సు ఇట్లనియెను, "నాదగ్గఱ నీ కిచ్చుటకు
నీరేమియు లేదు. నీవు చాలకాలము బ్రతికినావు. ఇప్పుడు
ముసలివాఁడవైనావు. నీవింక బ్రతుకవలసిన యవసర మేమి
యును లేదు." ఆతఁ డట్లుల పలికి ముసలివానిని లెక్కింపకయే
ముందుకు సాగిపోయెను. అపు డాకసమున తూర్పుదిక్కున నీల
వర్ణపు మెఱపులు మెఱసెను. అవి కత్తి యాకారముతో
నుండెను. అవి మూడుసా ర్లాకసమును గట్టిగాఁ గుదిపెను. తరు
వాత నంతయు నంధకారమయ మాయెను. సూర్యుఁ డొక
యెఱ్ఱని గోళమువలె నస్తమించుచుండెను.

సువర్ణ ప్రవాహ ధ్వని హాన్సుకు బాగుగ వినఁబడుచుండెను. అతఁడా ప్రవాహమును సమీపించెను. అందలి యలలు సూర్యుని యెఱ్ఱని కాంతులతో బాగుగఁ బ్రకాశించుచుండెను. అలలపై నురుగు రక్తవర్ణమును బోలి యుండెను. ధ్వని యంతకంతకు హెచ్చు కాఁజొచ్చెను. అయ్యది హాన్సుకు భరింపరానిదిగా నుండెను. అతని తల బరువు కాఁజొచ్చెను. గడగడ వణఁకఁజొచ్చెను. ఎట్టకేల కాతఁడు ధైర్యము వహించి, పవిత్ర జలమున్న పాత్రను సువర్ణ ప్రవాహము లోనికి విసరివైచెను. అంత నాతని శరీరమున మిక్కుటమగు చలితోఁ గూడిన ప్రవాహము ప్రవహించి నట్లాయెను. ఆతఁడు తూలెను; ఒక్క కేక పెట్టెను; క్రిందఁబడెను. నీ రాతనిని బూర్తిగ నావరించెను. హాన్సు ఒక నల్లని శిలగా మాఱిపోయెను.

* * *

## 5

హాన్సు తిరిగివచ్చునను గంపెడాశతో, గ్లక్, ఇంటివద్ద నొంటరిగా వేచియుండెను. కాని హాన్సు ఎంత కాలమునకును దిరిగి రాలేదు. గ్లక్ మిగుల భయపడెను. అందువలన నాతఁడు కారాగారమున నున్న జ్యేష్ఠ సోదరుని వద్దకుఁ బోయెను. జరిగిన విషయ మంతయుఁ బూస గ్రుచ్చినట్లు చెప్పెను. జ్యేష్ఠ సోదరున కెంతో సంతోషమాయెను. హాన్సు నల్లశిలగా మారిపోయి యుండునని యాతఁ డనెను. బంగార మంతయుఁ దానే పొందవచ్చునని యాతఁడు భావించెను.

గ్లక్ విచార హృదయముతో నింటికిఁ బోయెను. ఆతఁడు రాత్రి యంతయు సోదరుని కొఱకు కేడ్చుచునే యుండెను. తెల్లవారెను. ఇంట నాహార పదార్థము లెవ్వియు లేవు. డబ్బుగూడ లేదు.

అందువలన గ్లక్ పట్టణమంతయుఁ దిరిగి యొక బంగారపు పనివాని వద్దఁ బనికిఁ గుదిరెను. అచట నాతఁడు కష్టపడి బాగుగఁ బని చేయసాగెను. పని చాల పరిశ్రమముగఁ గూడ నుండెను. ఆతఁడు ప్రతిరోజు ఎక్కువగంటలు పనిచేయసాగెను. కొన్ని దినములగుసరి కాతఁడు కొంతడబ్బు నిలువచేయఁ గలిగెను. ఆ డబ్బుతో నాతఁడు కారాగృహ అధికారుల వద్దకుఁ బోయి, తన జ్యేష్ఠ సోదరునిపై విధింపఁబడిన జరిమానా చెల్లించెను. అధికారులు జ్యేష్ఠసోదరుని కారాగృహము నుండి విడిచిపుచ్చిరి. ఆతఁడెంతయు సంతసించెను. "నేను సంపాదించు బంగారములోఁ గొంతభాగము నీకిత్తును"అని యాతఁడు గ్లక్‌తో ననెను. "బంగారము మాట యటుంచుము. నీవుపోయి హాన్సు సంగతి విచారించుము" అని గ్లక్, తన జ్యేష్ఠ సోదరుని పరిపరి విధముల ప్రార్థించెను.

పవిత్ర జలమును హాన్సు దొంగిలించె నను విషయము జ్యేష్ఠునకుఁ దెలిసెను. "పవిత్ర జలమును దొంగిలించుట సరికాదు. అటుల దొంగిలించుట మంచిది కాదని సువర్ణ ప్రవాహ ప్రభువు భావింప వచ్చును. పవిత్ర జలమును సంపాదించుటకు నేనొక మంచి మార్గమును కనిపెట్టవలెను" అని జ్యేష్ఠుఁడు తలఁచెను. అందువలన నాతఁడు గ్లక్‌వద్దనుండి

కొంత డబ్బు తీసికొని యొక యవినీతిపరుడగు మతాధికారి వద్దకుం బోయి యాడబ్బు నిచ్చెను. తనకుం బవిత్ర జలము నిమ్మని కోరెను. దుష్టుఁడగు మతాధికారి యా డబ్బు తీసికొని, జ్యేష్ఠునకుం బవిత్ర జలము నిచ్చెను. పవిత్ర జలమును మంచి మార్గమున సంపాదించితి నని జ్యేష్ఠుఁడు భావించెను.

జ్యేష్ఠుఁడు సూర్యుఁ డుదయింపకమున్నే నిదురనుండి లేచెను. కొన్ని యాహారపదార్థములు, ద్రాక్షసారాయము ఒక బుట్టలోఁ బెట్టుకొనెను. పవిత్రజలపాత్రను దీసికొనెను. సువర్ణ ప్రవాహమువద్దకుఁ బయనము సాగించెను. మంచు ప్రవాహమును దాటుటలో నాతఁడు హెన్సువలెనే మిగులఁ గష్టపడెను. ప్రవాహమును జూచి కడు చోద్యమందెను. అలసి, ఆహారపదార్థముల బుట్టను దోవలో వదలివైచెను. నాఁడు ఆకసమున మబ్బు లెవ్వియును లేవు. కాని రోజంత ప్రకాశవంతముగ లేదు. ప్రకృతి దృశ్యములు వ్యతిరేకముగ నున్నట్లుండెను. అంతట విచారము వ్యాపించియున్నట్లుండెను.

నిటారుగనున్న కొండ నెక్కుచుండఁగా జ్యేష్ఠునకు దాహము వేసెను. ఆతఁడు పవిత్రజలములోఁ గొంత భాగము త్రాగఁదలఁచెను. పాత్రను బైకెత్తెను. అప్పు డాతనికి నేలపైఁబడియున్న అందాలబాలుఁడు కనఁబడెను. ఆతఁడు మూలుగుచుండెను; ఏడ్చుచుండెను. నీటికొఱకుఁ దపించుచుండెను. "నీకు నీరు కావలయునా! నాకే కావలసినంత లేదు. నీ కెక్కడినుండి తెచ్చి యిత్తును!" అని యనుచు జ్యేష్ఠుఁడు ముందుకు సాగిపోయెను. ఆతఁడు పోవుచుండగా

సూర్యకాంతి యంతకంతకు మందము కాఁజొచ్చెను. పశ్చిమ దిగ్భాగమున నొక పెద్ద నల్లని మబ్బుదయింపసాగెను. జ్యేష్ఠుఁడటుల నొక గంటకాలము పోయెను. ఆతనికి మరల మిక్కుటముగ దాహబాధ కలిగెను. ఆతఁడు మఱికొంత పవిత్రజలమును ద్రాగఁదలఁచెను. అంతలో నాతనికి ముసలివాఁడు కనఁబడెను. ముసలివాఁడు కడు దీనముగ మంచి నీరము కొఱకుఁ బ్రార్థించెను. "నీకు నీరు కావలయునా! నాకే కావలసినంత లేదు. నీ కెక్కడినుండి తెచ్చియిత్తును!" అని యనుచు జ్యేష్ఠుఁడు ముందుకు సాగిపోయెను. మరలఁ బ్రకృతి యాతనికి వ్యతిరేకముగఁ గన్పట్టెను.

జ్యేష్ఠుఁడు మఱియొక గంటసేపు ప్రయాణము చేసెను. మరల మిక్కుటమగు దాహబాధవేసెను. నీరు త్రాగుటకుఁ బాత్రను బైకెత్తెను. అంతలో నాతనికి ఎదుట హోన్సు పడియున్నటుల గోచరించెను. జ్యేష్ఠుఁడు బాగుగఁ బరీక్షించిచూచెను. అక్కడ పడియున్నవాఁడు చేతులు చాపి మంచినీరు కావలయునని ప్రార్థించుచున్నట్లుండెను. "నీవా! నీ విక్కడ పడియున్నావా!! నీకు మంచినీరు కావలయునా? కారాగారమువద్దకువచ్చి నాతో హాస్యముగ మాటాడితివే? వానిని మఱచితివా? ఒక్కపరి జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. నే నింతదూరము నీరు మోసికొనివచ్చినది, నీకొఱకే నను కొంటివా! నీ గొప్ప లిప్పు డేమాయెను!!" అని యనుచు జ్యేష్ఠుఁడు ముందుకు నడచిపోయెను. కాని యాతని కా పడియున్నవానిలో వ్యంగ్యమున్నటుల తలంపు కలిగెను. ఆతఁడు

వెనుతిరిగి చూచెను. ఎవ్వరును గనఁబడలేదు. అంతయు భ్రాంతి !

జ్యేష్ఠునకు హఠాత్తుగ మిక్కుటమగు భయము కలిగెను. అటుల భయము కలుగుట కాతనికిఁ గారణమేదియుఁ గనఁబడలేదు. కాని బంగారము సంపాదింపవలెనను నాశ, భయమును మించిపోయెను. అందువలన నాతఁడు ముందుకు సాగిపోవుచునేయుండెను. వాతావరణము, ప్రకృతి యెంత వ్యతిరేకముగనున్నను నాతఁడు ఆఁగలేదు. ఎట్టకేల కాతఁడు పోయిపోయి సువర్ణ ప్రవాహమును జేరుకొనెను. గట్టుమీఁద నిలఁబడి పరీక్షించుచుండెను. అలలు మేఘములవలె నల్లగా నుండెను. నురుగు మాత్రము రక్తవర్ణముగానుండెను. క్రింద నీటి గర్జనలు; పైన ఉఱుములు. అట్టి సమయమున జ్యేష్ఠుడు పవిత్రజలపాత్రను సువర్ణ ప్రవాహములోనికి విసరివైచెను. అదే సమయమున నొక పెద్ద మెఱపు ఆతని కన్నులను మిఱుమిట్లు గొల్పెను. క్రింద భూమి కదలెను. ఆతఁడు తూలి క్రిందఁబడెను. నీరాతనిపైఁగాఁ బ్రవహించి భీషణారవము చేసెను. జ్యేష్ఠుఁడు నల్లశిలగా మాఱిపోయెను. అటుల రెండు నల్లశిల లేర్పడెను !

* * *

జ్యేష్ఠసోదరుఁడు ఇంటికిఁ దిరిగి రాలేదు. ఆ విషయము గ్లిక్‌నకు మిగుల విచారము కలిగించెను. ఏమిచేయవలెనో, ఆతని కేమియుఁ దోఁచలేదు. ఆతఁ డంతకుమున్ను సంపాదించిన డబ్బంతయు ఖర్చయిపోయెను. అందువలన నాతఁడు మరల బంగారపు పనివానివద్దకుఁ బోయెను. ఆతఁడు గ్లిక్‌చే బాగుగఁ బనిచేయించుకొని, కొలఁదిగ ధనము నిచ్చెడివాఁడు. అటుల నొకటి రెండు నెల లగుసరికి ఆతనికి మిగుల విసుగైను. అందువలన నాతఁడు సువర్ణప్రవాహమువద్దకుఁ బోయి తన యదృష్టమును బరీక్షించుకొనఁదలఁచెను.

“సువర్ణప్రవాహప్రభువు చాల దయగలవానివలెఁ గనఁబడెను. ఆతఁడు నన్నెన్నటికిని నల్లశిలగామార్చఁడు” అని గ్లిక్ దలఁచెను. అందువలన నాతఁ డొక మతాధికారివద్దకుఁ బోయి తనకుఁ గొలఁదిగ పవిత్రజలము నిమ్మని వేఁడుకొనెను. అతఁ డడిగినదే తడవుగ మతాధికారి కడు సంతోషముతో నాతనికిఁ బవిత్రజలము నిచ్చెను. తరువాత నాతఁడు కొన్ని రొట్టెముక్కల నొక బుట్టలోఁ బెట్టుకొని పవిత్రజలపాత్రతో సువర్ణప్రవాహమువద్దకు బయలుదేఱెను.

గ్లిక్ అంత బలశాలికాఁడు. కొండలపై నడచుట నేర్చినవాఁడుగూడఁ గాదు. అందువలన నాతఁడు మంచు ప్రవాహమును దాఁటుటలోఁ దన సోదరులకంటె నిరువది రెట్లెక్కువ కష్టపడవలసివచ్చెను. ఆతఁ డప్పుడప్పుడు జాఱి

క్రిందబడసాగెను. రొట్టెలున్న బుట్ట కొండ యడుగు భాగమునకు దొర్లుకొనుచుఁ బోయెను. వింత వింత ధ్వనుల విని యాతఁ డపరిమితముగ భయపడసాగెను.

మంచు ప్రవాహమును దాఁటిన తరువాత నాతఁడు గడ్డిపైఁ బరుండి చాల కాలము విశ్రాంతి తీసికొనెను. తరువాత లేచి కొండపై కెక్క ప్రారంభించెను. అప్పుడు వేఁడి చాల మిక్కుటముగ నుండెను. గ్లెక్ ఒక గంట కాలము ప్రయాణము చేసెను. అంత నాతనికి మిక్కుటమగు దాహబాధ కలిగెను. ఆతఁడు తనవద్దఁ గల పవిత్ర జలములోఁ గొంతభాగము త్రాగఁబోయెను. అంతలో నాతనికిఁ గొండపై భాగమునుండి కఱ్ఱ నూతగాఁ గొని క్రిందకు నడచి వచ్చుచున్న ముసలివాఁడు కనఁబడెను. ఆతఁడు కడు నీరసస్థితిలో నుండెను. గ్లెక్‌తో నాతఁ డిట్లనియెను, "కుమారా! నేను గడు దాహము గొనియున్నాను. నీవద్ద మంచినీరు గలదు. నాకుఁ గొలఁదిగ నిమ్ము." గ్లెక్ ఆతనిని బాగుగఁ జూచెను. ముసలివాని నీరసస్థితి నాతఁడు గ్రహించెను. పవిత్ర జలపాత్రను ముసలివాని కిచ్చి, "దయయుంచి జల మంతయుఁ ద్రాగవద్దు" అని యనెను. కాని ముసలివాఁడు మూఁడింట రెండువంతులు త్రాగి, పవిత్రజల పాత్రను గ్లెక్‌న కిచ్చెను. అతని నాశీర్వదించెను.

అంతలో హఠాత్తుగఁ ద్రోవ చక్కనాయెను. గ్లెక్ దాహబాధతో నున్నను, ఆతని హృదయమున నానందము వెల్లివిరిసెను. అచ్చటచ్చట పచ్చగడ్డి బాగుగ నలముకొని

యుండెను. కీటకములు చక్కని సంగీతము పాడఁ జొచ్చెను. అట్టి యానందకరమైన సంగీతమును దా నెన్నఁడును మున్ను వినియుండలేదని గ్లక్ తలంపఁ జొచ్చెను. గ్లక్ మఱియొక గంట కాలము ప్రయాణము చేసెను. దాహబాధ మునుపటి కంటె మిక్కుటమాయెను. మిగిలియున్న పవిత్రజలమును త్రాగవలసిన యత్యవసరపరిస్థితి యేర్పడునని గ్లక్ భావించెను. ఎట్టకేల కాతఁడు జలమును త్రాగఁదలఁచి పాత్రను పైకెత్తెను. అంతలో నాతనికి నీటికొఱకేడ్చుచుఁ గొనయూపిరితోఁ బరుండి యున్న బాలుఁడు కనఁబడెను. గ్లక్ తన దాహబాధను గొలఁది కాలమువఱకు నాపుకొనఁ దలఁచెను. అతఁడు పవిత్రజల పాత్రను బాలుని నోటివద్దఁ బెట్టెను. బాలుఁడు పాత్రలోఁ గొన్ని చుక్కలుమాత్ర ముంచి మిగిలిన నీరమంతయుఁ ద్రాగివైచెను. బాలుఁడు చిఱునవ్వు నవ్వెను; లేచెను; కొండపై నుండి క్రిందకు గబగబ పరుగెత్తెను. బాలుఁడు కడుదూర మేఁగి యొక చుక్కయంత యగువరకు గ్లక్ చూచుచునే యుండెను.

పిమ్మట గ్లక్ ముందుకుఁ బ్రయాణము సాగించెను. ఆతని కంతటను రకరకముల మనోహరములగు పూలమొక్కలు కనఁబడఁ జొచ్చెను. పూల యందము వర్ణనాతీతము. ఎఱ్ఱని పూవులు, నీలంపు పూవులు, తెల్లని పూవులు, ఇంకను రంగు రంగుల పూవులు కడు రమ్యముగనుండి మనోహరమగు శోభతో నొప్పుచుండెను. పూలయంద మిట్లుండ ఆకసమున కాంతి కూడఁ గడు సొగసుగనుండెను. గ్లక్, ఆతని జీవిత

ములో నప్పు డనుభవించిన యానందమును, సౌఖ్యమును నిదివఱ కెన్నఁ డనుభవించియుండలేదు.

అటుల గ్లక్ మఱియొక గంటకాలము ప్రయాణము చేసెను. దాహబాధ మున్నెన్నఁడు కనివిని యెఱుఁగనంత యధికమాయెను. ఆతఁడు తన పవిత్రజలపాత్ర కొక్కపరి పరిశీలించెను. అందయిదాఱుచుక్కలనీరు మాత్ర ముండెను. ఆ చుక్కలను నోటిలోఁబోసికొనుట కాతఁడు సాహసింపఁజాలక పోయెను. అంతలో నాతనికిఁ గడు కష్టముతో నూపిరి పీల్చుచున్న కుక్క కనఁబడెను. దాని దీనావస్థను గ్లక్ గమనించెను. అయిదువందల యడుగులపైనున్న సువర్ణప్రవాహమును గమనించెను. అపు డాతనికి మఱుగుజ్జుమాటలు జ్ఞప్తికి వచ్చెను. "ఎవరైనను మొదటి ప్రయత్నమున మాత్రమే విజయమును సాధింపఁగలరు." ఆతఁడు కుక్కను దాఁటి పోవుటకుఁ బ్రయత్నించెను. కుక్క కడు దీనముగ నఱచెను. గ్లక్ ఆఁగిపోయెను. ఆతఁ డిట్లు భావించెను. "పాపము కుక్క కడు దీనావస్థయందున్నది. ఇప్పుడు నేను దాని దాహబాధను దీర్పకపోయినచో నది నేను దిరిగివచ్చుసరికిఁ జచ్చిపడియుండును." ఆతఁ డటు లనుకొని పాత్రలోఁగల యైదాఱు చుక్కల నీరమును గుక్క నోటిలోఁ బోసెను.

కుక్క ఒక్కపరి చెంగున గంతుచు లేచెను. వెనుక కాళ్ళపై నిలఁబడెను. దాని తోఁక క్రమక్రమముగ నదృశ్యమాయెను. దాని చెవు లంతకంతకుఁ బెద్దవి, మృదువైనవి, సువర్ణచ్ఛాయతోఁ గూడినవి కాఁజొచ్చెను. ముక్కు

బాగుగ నెట్టినాయెను. కన్నులు కడు తీక్ష ణములు, ప్రకాశ వంతములు నాయెను. మూడు క్షణములలోఁ గుక్క యదృ శ్యమాయెను. ఆ స్థానమున గ్లక్కుఁ బూర్వపరిచితుఁ డగు సువర్ణ ప్రవాహ ప్రభువు నిలఁబడియుండెను.

ప్రభువు గ్లక్‌తో నిట్లనియెను, "ఏమాత్రము భయ పడకుము. నీవు చాల మంచిపని చేసినావు. అంతయు బాగు గనే జరుగును. నీవు సత్ఫలితమునే పొందఁగలవు. ముందే నీ వెందులకు రాలేదు? బుద్ధిహీనులు, కఠినాత్ములు నగు నీ సోదరుల నేల పంపినావు? వారిని నల్లశిలలుగా మార్చవలసిన కష్టము నాకేల కల్పించినావు? అబ్బ, వారు చాల కఠినమైన శిలలుగాఁ గూడఁ దయారైనారు."

"అయ్యో, మీరంత కఠినహృదయులా! నా సోదరు లను నల్లశిలలుగా నేల మార్చినారు?" అని గ్లక్ గద్గదస్వర ముతో ననెను.

"నేను కఠినుఁడ నేమాత్రము కాదు. వారు నా ప్రవా హములో నపవిత్రజలమును గలిపినారు. నేను దానిని సహింతు ననుకొంటివా?" అని సువర్ణప్రవాహప్రభు వనెను.

"వారు అపవిత్రజలమును దేలేదే! చర్చినుండి వారు పవిత్రజలమును దెచ్చినారు" అని గ్లక్ అనెను.

"వా రా నీటినిఁ జర్చినుండి తెచ్చియుండవచ్చును. కాని అలసి సొలసి యున్నవారికి, దాహబాధతో నటమటించు

చున్నవారికి, మరణావసరముం దున్నవారికి దయతో నీయఁబడని నీరు స్వర్గమునుండి తేబడినను అపవిత్రమైనది. నరకమునుండి తెచ్చిన నీరైనను దయారసముతో మిళితమైయున్న నీరు, పరోపకారమున కుపయోగపడిన పాత్రలోని నీరు కడు పవిత్రమైనది" అని సువర్ణ ప్రవాహ ప్రభువు దీర్ఘముగ జవాబొసఁగెను.

మఱుగుజ్జు తన పాదములవద్దఁ గల యొక లిల్లీపుష్పమును గోసెను. దాని తెల్లని రేకులపై మూఁడు మంచు కణము లుండెను. మఱుగుజ్జు ఆ కణములను గ్లక్ పవిత్రజల పాత్రలోనికి విదిల్చెను. "ఈ చుక్కలను ప్రవాహములో వేయుము. నీవు కొండ కావలి భాగమునుండి బంగారు లోయ లోనికిఁ బొమ్ము. త్వరగా ప్రయాణముచేసి విజయమును సాధింపుము" అని ప్రభు వనెను. పిమ్మట నాతఁడు క్రమ క్రమముగ నదృశ్యుఁ డాయెను.

గ్లక్ సువర్ణ ప్రవాహపు టొడ్డును జేరుకొనెను. అందలి యలలు కడు స్వచ్ఛముగను, సూర్యునివలెఁ బ్రకాశవంతముగను నుండెను అతఁడు మూఁడుచుక్కల నీటిని ప్రవాహములోఁ బోసెను. ఆ చుక్కలు పడిన చోట నొక సుడి బయలుదేఱెను. సుడితోబాటు సంగీతధ్వని చేసికొనుచు నీరు లోనికిఁ బోయెను.

గ్లక్ కొంతతడవు వేచిచూచెను. సువర్ణ ప్రవాహము బంగారు మయము కాలేదు. అంతేకాదు. దానిలోని నీరంత

కంతకుఁ దగ్గిపోవుచున్న ట్లుండెను. గ్లక్ నకుఁ గడు ఆశాభంగ మాయెను. అయినను ఆతఁడు తన స్నేహితుఁడగు మఱుగుజ్జు చెప్పినటుల చేయఁదలఁచెను. కొండ కావలి భాగమునుండి బంగారు లోయ దిక్కునకు దిగిపోసాగెను. అతఁ డట్లు పోవు చుండఁగా నీరు భూమిలోనుండి పాఱుచున్న సవ్వడి యాతనికి వినఁబడిన ట్లుండెను. ఆతఁడు బంగారు లోయను సమీ పించెను. అహో, ఏమి యాశ్చర్యము! ఏమి యాశ్చర్యము!! సువర్ణ ప్రవాహమును బోలిన యొక ప్రవాహము ఒక కొండ పైనుండి బంగారు లోయలోనికి పవహించుచుండెను. అది యనేక పాయలై ఎఱ్ఱని యిసుక గుట్టలలోఁ బ్రవహించు చుండెను.

గ్లక్ ఆశ్చర్యముతోఁ బరీక్షింపసాగెను. క్రొత్త ప్రవాహ ముల ప్రక్క పచ్చని గడ్డి మొలకలెత్తసాగెను. తీఁగలు ప్రాఁకఁ జొచ్చెను. పూలమొక్కలు పెరుఁగసాగెను. రక రకముల పుష్పములు పుష్పింపసాగెను. ద్రాక్షతీఁగలు కావలసి నన్ని యుండెను. భూములు పంటలతో నిండియుండెను. అటుల బంగారు లోయ యెప్పటి బంగారు లోయయై సార్థకనామము వహించెను. నిర్దయవలనఁ గ్రూరత్వమువలన గోల్పోయిన సంపద, ప్రేమవలనఁ దిరిగి సంపాదింపఁబడెను. అటుల ప్రేమ యాధిక్యత స్పష్టమాయెను.

గ్లక్ పోయి బంగారులోయలో నివసింపసాగెను. ఆతని వద్దకుఁ బోయి లేదనిపించుకున్నవా రెవ్వరును లేకుండిరి. బీదల కాతఁడు కల్పవృక్షమువలె నుండెను. ఆతనికిఁ గావలసి

నంత ధాన్యము, కావలసినన్ని సంపదలు లభించుచుండెను. ఆతని గృహము స్వర్గధామ మాయెను. మఱుగుజ్జు వాగ్దానము చేసినటుల సువర్ణప్రవాహ మాతనిపట్ల సార్థకనామము వహించెను.

ఈనాటికిఁగూడ బంగారులోయలో నివసించుచున్న ప్రజలు మూఁడుచుక్కల నీరు పడిన ప్రదేశమును, సువర్ణ ప్రవాహము భూమిలోనుండి ప్రవహించి బంగారులోయలోఁ బ్రవేశించిన మార్గమును జూపుదురు. సువర్ణప్రవాహ జన్మ స్థానమువద్ద నిప్పటికిని రెండు నల్లని శిలలను జూడవచ్చును. సూర్యాస్తమయ సమయమున నీ రా రెండు శిలల చుట్టును విచారముతో ఘోష సల్పుచుండును. ఇప్పటికిని బంగారు లోయలోని ప్రజ లా రెండు శిలలను 'నల్లసోదరులు' అని పిలుచుచుందురు.

★ ★ ★